3102 సం॥ నాడు ఆరంభమైన యుగారంభము నందు భారతయుద్ధము జరుగలేదనియు దర్వాత జరిగిన యుగారంభకాలము నందు నది జరిగెననియు తేలుచున్నది. అనగా అప్పటికి కలియుగం అంత్యమైనది. కాని దానిని అట్లు అంత్యము అయినట్లు భావింపనీయక, అప్పటివారు యుగాదులసంఖ్యను పెంచి మార్చివేయుటలో మన పురాణములందు కలియుగారంభముతో కృష్ణనిర్యాణము, భారతయుద్ధములు కలిపివ్రాసి సరిపుచ్చుకొన్నట్లు కనబడుచున్నది. దీనికి దృష్టాంతము మహాభాగవతములో కనబడుచున్నది. దీనిలో 4 యుగములే జరిగినట్లుగూడ కలదు.

శ్రీకృష్ణ నిర్యాణకాలమునకు, సప్తర్షులు మఖానక్షత్రమం దుండిన కాలములో వచ్చిన కలి, ప్రవేశించి 1200 జరిగినను అది మిక్కిలి తీక్షణముగా నుండక కృష్ణనిర్యాణానంతరమే ప్రవృద్ధమగుననియు అందుచే నప్పటినుండే కలిని భావింపవలయుననియు, కలిపురుషుడు రవి శుక్ర చంద్ర గురువు లేకరాశిగతులైనపు డుద్భవించుననియూ మహాభాగవతమున ద్వాదశ స్కంధమునందు చెప్పబడినది. (ఆనందప్రెస్ ముద్రిత ప్రతి) సప్తర్షులు వాస్తవముగ మఖానక్షత్రమందు కలియుగారంభమున నునిడినను ఆ విషయము కృష్ణనిర్యాణమునకును, భారతయుద్ధమునకును పరీక్షిత్తు జననమునకును గూడ అంటగట్టి మన పూర్వపురాణములన్నియు సవరించుకొన్నట్లు పైభాగవత కథనమువల్ల గూడ గోచరించును. ఇవియన్నియు దేవమాన యుగాలు భారతయుద్ధానంతర మేర్పరచినప్పుడు జరిగియుండును. దేవాపి మరుత్తులనువారు కలాపి యను గ్రామమున కలియుగాంతమువరకు వేచియున్నారనియు కల్యంతమున వారు సూర్యవంశము నుద్ధరింతురనియు జెప్పబడిన పురాణముల వ్రాత లా కాలపు యుగములు త్వరలోనే యంతమొందుటను భారతయుద్ధముతర్వాత వచ్చు యుగమును సూచించుచున్నవి. దీనినిబట్టి అదివరకు మామూలుగా 1200 సం॥ల పరిమాణము మాత్రమే గల యొక యుగము భారతయుద్ధమైన పిమ్మట 87 సం॥లకు వచ్చినట్లును, అప్పుడే కలియుగాంత మయ్యెననియు, కలి ఆరంభమందే మఖలో సప్తర్షులుండిరనియు గ్రహింపవచ్చును. అంతేగాని భారతయుద్ధకాలమందు గాదు.



ఆ వ్రాతలు తర్వాత కల్పిరి కాని మనవారు అప్పుడే యుగములు పెంచుటవల్ల పూర్వపద్ధతిగూడ కొంతకాల మమలునందుండెను. ఇది కొన్నిచోట్ల నుండియుండును. దీనికి దృష్టాంతము సూర్యసిద్ధాంతము.

## సూర్యసిద్దాతము

సూర్యసిద్ధాంతమను గణితగ్రంథము కృతయుగాంతమున చెప్పబడినట్లు అందు వ్రాయబడినది. ఈ కృతయుగమేది? ఇక్ష్వాకునాటిదా? లేక భారతయుద్ధానంతరము వచ్చిన కృతయుగమా? దేవమాన యుగమా? దేవమానయుగ కాలమునకు మానవోత్పత్తియే సందేహము. ఇక్ష్వాకునాటి మానవ సాధారణ కృతయుగ కాలమున కింకను జ్యోతిషవిజ్ఞానము హెచ్చుగా పెరిగియుండలేదు. ఇటీవల లభించిన వేదాంగ జ్యోతిషము చాల పరిమితిగానే యున్నది. అందుచే నిది భారతయుద్ధము తర్వాత వచ్చిన కృతయుగాంతమునందే వ్రాయబడినట్లు చెప్పవచ్చును.

దీనికి దృష్టాంతములు లేకపోలేదు. ఆర్యభట్టు ఆర్యభటీయమను గణితశాస్త్రమును కలియుగము 3600 సంవత్సరములో వ్రాసినట్లు చెప్పుకొని యున్నాడు. వేదాంగ జ్యోతిషము తర్వాత మొదటిగ్రంథ మిదియే. ఈ శాస్త్రమునందలి కొన్ని సూత్రములు సూర్యసిద్ధాంతములో చెప్పబడినవి. వరాహమిహిరుడను మన ఖగోళశాస్త్రవేత్త 505 A D. ప్రాంతములో విక్రమార్కుని (III) ఆస్థానమున మహాకవి కాళిదాసునితో సహా ఆస్థానపండితుడుగానుండి పంచంగసిద్ధాంతికాద్యనేక గ్రంథములనురచించెను. అందులో సూర్యసిద్ధాంతము నుదహరించెను. * అందుచే సూర్యసిద్ధాంతము కలి

* చివరకీ గణితశాస్త్రవేత్తకాలములోగూడ వివాదాభిప్రాయములు జనించెను. ఆతడు పేర్కొనిన శకకాలములను సైరసు శకమని తలచి పెక్కండ్రు పొరబడిరి. ఈ సంశయములను విచ్ఛేద మొనరించుచున్నది కాళిదాసు మహాకవి రచితమగుజ్యోతిర్విదాభరణము. దీనిలో స్పష్టముగా (జైన) కలివర్షములు 3068 లో తానా గ్రంథము వ్రాసినట్లును, వరాహమిహిరుడును తానును మరికొందరు పండితులును విక్రమార్కుని ఆస్థానపండితుల మనియు వ్రాసియున్నాడు. విక్రమార్క, శాలివాహన శకముల నితడు ప్రస్తావించెను. అందుచే కాళిదాసుగూడ 500 A.D. ప్రాంతీయుడగుచున్నాడు.